

కృతిపతి:

శ్రీ మేదరమెట్ల రోశయ్యగారు

లింగంగుంట్ల

# కృతిపతి : శ్రీ మేదరమెట్ల రోశయ్యగారు

లింగంగుంట

శ్రీలన్బాసిలు పుణ్యభారతధరిత్రిన్ దెన్నుభాగంబునన్
గాలున్ లింగముగుంటయన్పురము; బంగారంపువాతూలము
వాలాయమ్మట నృత్యముల్ సలుపు; సర్వక్రప్రభావమ్మునన్
ఫాలాక్షాచ్యుత వారిజోద్భవులు కాపాడంగ సరిల్లెడిన్ ॥

గీ॥ కమ్మదొరలాపురాన విఖ్యాతి గాంచి
ధనము బదులిత్తు రలకు బేరుసికిఁగూడ
అందు మేదరమెట్లవా రనుకులంబు
సాటిలేక వహించె విస్తారకీర్తి.

చ॥ బీదలఁ బిల్చిఁబంచి తినఁబెట్టి, ధరింపఁబుట్టములిచ్చి నిం
పాదిగఁబంపుచుండు; రెడబాయ రనాథుల నర్థికోటులన్
మేదరమెట్లవంశజులు; మేలని సర్వజనుల్ నుతింపఁగన్
బాదుగనుందురెల్ల జనపాళికి శేషవదాన్యమాన్యులై.

కం॥ వారింటఁ గుడుచుచుందురు
కోరిన వంటకము నర్థికోటులు సతమున్
ధారుణి లక్ష్మీదేవమ
భూరి ప్రసన్నయౌచు నన్నపూర్ణ యనంగన్.

ఉ॥ కొండలుపిండిజేసి తనకుం జెయిచాచినవారిఁ దన్పు నా
ఖండలసూతివైరికి మొగమ్మునఁ జెల్లదనమ్ము దోప; భూ
మండలమేలురాజు లవమానముజెందఁగ దానశీలుఁడై
కొండయగారు కీర్తిగొనుఁ గోరినదెల్ల శివుండొసంగగన్

కం॥ అంగనతోఁ గొలిచెను శివ
లింగమ్మును సుతులకై చలింపనిభక్తిన్
లింగయసాంబడు పుత్రుని
నంగజవైరి దయఁబూని యాయనకిచ్చెన్

కం॥ బంగారురంగుఁ గొనియె ని
జాంగమ్మంగనలు క్రొత్త యంగజుఁ డనఁగన్
పొంగారు యౌవనంబున
లింగయ వర్ధిల్లుఁ గడు బలీయుండగుచున్

ఆ॥ అడుగువారికిచ్చు నాచార మిలఁగలుగు
నడుగకున్నఁ బిలిచి యిడెడుఁదాను
కష్టమొందుచున్న ఖలునైనఁ గరుణించు
దయకునిలయుఁ డపరధర్మరాజు.

వినయమెడందఁబూని పృథివీసుర సజ్జన బంధుమిత్రులన్
దనుపు సపర్యలన్; వలయు దానములన్వెదజల్లుఁ బేదకున్;
వనితల సోదరీమణులభంగిఁ దలంచు నఘంబెఱుంగఁ డీ
ఘనుని వరించి పెక్కునవకంజదళాక్షులు ప్రస్తుతింపఁగన్.

కం॥ శంకరుని కరుణచే నక
ళంక స్తవనీయ గుణకలాపాన్వితయై
వెంకమ్మ యనఁగ నెగడిన
పంకేరుహపత్రనేత్రఁ బరిణయమాడెన్.

చం॥ సకలముఁగాఁపురమ్మున నెసంగనవారిగ, నంటుమలె
లిక నొకపైనసతీపతులు, లేమిఁదపించుదరిద్రపాళి, శ్రాం

తిరిఁగ దుర్దూరులౌ జనుల, దీనత దుర్వ్యథఁ జెందువారి నం
డకుఁగొని యాదరించి కరుణమ్మునఁగాచెద రార్తబంధులై

ఉ॥ అత్తరి వారిభక్తి భుజగాభరణుం డెద మెచ్చి యిచ్చె నీ
మత్తగజేంద్రయానకుఁ గుమార్తెల నిర్వురఁ బుత్రు నొక్కనిన్
పుత్త్రడి తూఁగుటుయ్యెలలఁ బూవులసెజ్జల గారవంబుపై
నెత్తినచంక డించక హసించుచుఁ బెంచెద రెల్లబంధులున్.

గీ॥ ఈశ్వరుం డీప్సితార్థము లిచ్చుచుండ
సిరు లశేషంబుగా నింటఁ బెరుగుచుండఁ
బంజరంబుల చిలుకలభంగిఁ బెరిగి
పెద్దలైరి క్రమంబుగాఁ జిన్నవారు.

కం॥ పలుకులు చెప్పుటలో నొక
చిలుకయె యననొప్పు బాలచిలుకమ్మను బెం
డిలియై కామయకన స
త్కులజుని హనుమంతురావు కొడుకును వసుధన్.

కం॥ ఆనందియ్యకు రాజమ
మానినియై కొలువఁగాఁ గుమారిత, గొడుకున్
దానమిడె హరియు; నాదియ
సూనుఁడు, చిలుకమ్మపుత్రి శోభిలుదురిలన్.

అనఘుఁడు రోశయాఖ్యుఁడు దయాగుణమూర్తి యుదారశీలుఁడం
గనల వినూత్నమన్మథుఁ, డఖండవచఃప్రతిభావిలాసుఁ డా
జనకుని ముద్దుపుత్త్రకుఁడు సద్యశుఁ డొప్పులకుప్ప, శాంతభూ
షణుఁ డుపకారి; కొల్చెదగజప్రభుఁ దత్పురవాసు లీఘనున్.

చం॥ కనకపుబొమ్మయాచు జిలుకమ్మయనన్విలసిల్లునంగనా
మణి, సకలోరుసద్గుణసమంచితరత్నవిభూష సర్వస
జ్జననుతసచ్చరిత్రి, సరసతఁ మెఱుంగుసుశీలభార్యయై
తనుపఁగనీకృతీసుఁడుముదంబునవర్ధిలుఁబుణ్యమూర్తియై.

గీ॥ ఆంజనేయులుశివలింగయ్య, యనుసుతులు
తనయ యొండు దైవాధీనమనఁగ వారి
పిల్లలై ముద్దుఁగూర్పఁగ; వృద్ధిఁజెందఁ
గాఁపురము మూఁడుపూలాఱుకాయలగుచు.

ఉ॥ శంకరుఁడంతనిచ్చె నొకచక్కనిముద్దులచిన్నవాని, నే
ణాంకునిఁబోలువానిని దయాగుణమూర్తినిఁదల్లిదండ్రులున్
శంకరరావునామమిడిసాఁకుదు, రాశ్రితపాళినిత్యమున్
జంకలుగందనెత్తియురసంబునఁబెంచెదరాగృహమ్మునన్

గీ॥ వారిజాక్షుల కాదర్శవనితయగుచు
నిఖిల సద్గుణ రాశికి నిలయమగుచుఁ
గవులుకీర్తింపఁగాఁ జిలుకమ్మగారు
పతిపదమ్ములఁగొల్చు సద్భక్తిమీఱ.

గీ॥ పతికి నెదురాడు టెరుగదిప్పంకజాక్షి
పరులనొప్పించదెన్నడీ సరసిజాక్షి
నిఖిలదీనార్థులందన్ను నీరజాక్షి
వరునితలమానికంబయ్యె వనరుహాక్షి.

గీ॥ వండిపోయు నభ్యాగతుల్వచ్చిరేని
మాని స్వసుఖంబు నడురేయియైనఁగాని;

పరులు తనవారలన్న భావంబు లేక
ముదురఁగాచిన నేతిలో ముంచి తేల్చు.

సీ॥ అత్తయింటఁ జిల్కమ్మగారడుగుఁబెట్ట
సిరులు మొలకెత్తి యభివృద్ధి జెందసాఁగె
పసిడివానలు నట్టింటఁబడఁదొడంగె
అనుకొనినఁదోఁచు ముందుఁగోరినసుఖంబు.

కం॥ ఇప్పుడతి ఘనసపర్యల
మెప్పింపఁగ, సగ్వాజనులు మేలనిపాడన్
గుప్పిటనర్థులఁదనుపఁగఁ
దప్పఁడు శ్రీరోశయాభిధానుండెలమిన్.

మ॥ తనకన్గోనలసద్దయార్ద్రసమునిత్యమ్ముర్లు; నేజీవిమై
నను బాధన్ గనఁజూడఁడోపినవిధిన్ దప్పింపయత్నించు నె
వ్వనికిన్ గిడొనరింపఁడెగ్గయిన; సర్వప్రాణి సత్సేవనా
ఘనకార్యాచరణమ్ముధర్మమయిసౌఖ్యమ్మిచ్చునశ్రాంతమున్.

శా॥ శ్రీలందేలినగానిదుర్వ్యథలఁగాసింజెంది యల్లాడు దీ
నాలాపధ్వనులాలకించుఁ; దగుసాయమ్మిచ్చు; నీఁజాలఁడా?
యాలుంబిడ్డలనీడి చింతపడు; నీత్యాగిన్మహాసద్దయా
శీలున్నాంచి సుఖాంతుగప్పరిజనశ్రీణుల్ ప్రమోదంబునన్

ఉ॥ ఆడఁడసత్యమొట్టిపరిహాసమునందును, నన్యకాంతలన్
జూడఁడు సోదరీమణులఁబోల్పునదక్క; ప్రపన్నపాళిఁ జే
వీడఁడు వారికోర్కెనెరవేరినదాఁక; దరిద్రుఁడెవ్వఁడేన్
వేడిన నేన్నఁడిసెలనీయకపంపఁడు, శాంతియంతనా.

చం॥ పలుకులయందునన్ గెలుచుఁబన్నగనాథుని, దానమందున
కేలువల వైరిపుత్త్రకునిఁగాదనిపించు; సుఖప్రశాంతి న
బ్బలరిపు మించు; ధర్మజుఁడు వంచు శిరంబును సత్యమందు నీ
యలఘుచరిత్రు నేవరములందుట గాంచెనొ? తల్లి యుద్ధరన్.

కం॥ కనువిచ్చెనొ? యొరుని కడు
పునఁగల ప్రేవుల గణించుఁ; బూనినియుసమై
నను ముచ్చటించెనా? వ
ర్తనమంతయు నెఱుఁగఁజాలు ప్రాజ్ఞుఁడు బళిరే.

ఆ॥ పరసుఖంబు తనకు బహుళశాంతియొసంగు;
కీర్తినెంచి ధనముఁ గేలఁజిమ్ము;
కవులగారవించుఁ; గావ్యకన్యల మెచ్చు
గుణముఁగోరు కులము గుఱుతు లేదు.

గీ॥ కృతినిఁగృతిమనోహరుని సత్కీర్తిజలధి
నీశ్వరుఁడు ముంచి తేల్చి రక్షించుఁగాత !
సూర్యచంద్రులప్రాయమ్ము, శోభఁగలిగి
గురుముదంబున దిశల వెలుగుదురుగాత !



గ్రంథకర్త:

కె. సి. జాన్, బి. ఏ.

# బహిష్కారము

## ప్రథమాశ్వాసము



శ్రీలన్ రాజిలు భారతావనిరహించెన్ జిన్నయూ; రందునన్
మాలండంచు జనమ్ములెల్లఁ బిలువన్మర్యాదకున్ దూరుఁడై
యాలుంబిడ్డల కశ్రివుల్గురియ దైన్యమ్మందు; క్షుద్బాధమా
మూలాఁగాఁపురమందుఁ బెద్దతలి సంపూర్ణానురాగమ్మునన్.

గీ॥ ఈశ్వరుఁడు మానవత్వమ్ము నిచ్చెఁగాని
నరుఁడు కాదని వాని హీనముగఁజూచు
పాదములు నాల్గు ధర్మదేవతకు విరిగె
పాపమతఁడుండు నొకమూల పర్ణశాల,

శా॥ ఇల్లా? యెండకెగాని, వానలకు తేతెల్ల జ్జలమ్మందు నా
పిల్లాజెల్లలు మున్గితేలుదురు; తప్పింపంగ రారెవ్వరున్
ముల్లోకేశుఁడు కన్నుమూసె; వెతమామూలయ్యెఁ; గన్నీటిలో
నిల్లాలున్నదియందు నీశ్వరునిఁ బ్రార్థించు న్దివారాత్రముల్.

చం॥ నలిగికృశించునాతఁడు; తినంగడుపారఁగఁ దిండిలేదు పి
ల్లలుగలరార్గు రీశ్వరవిలాసములేని దరిద్రుఁడగుఁ; గా
వలెనని దోసిలొగ్గు ధనవంతునికీయఁడు; కాళ్ళురాని పా
పలకయి చెప్పరానిచెఱపాలయి రత్తలిదంశ్రి లక్కటా !

ఆతఁడు కోడికూయుసమయంబున లేచుఁ; బరాత్పరాంఘ్రి సం
జాతయుగమ్ముఁగొల్చుఁ; గలచల్దిభుజించు; నిసుంకురాకముం
డాతురమొప్పనేఁగి పొలమందున నూడిగమాచరించు, న
ద్దాతయొసంగు దాన నిజదారసుతాదులఁ గాచు నిచ్చలున్.

ఉ॥ బాలురవిద్దెలందనుపు పంతులొకండటనుండు; నొక్కెడన్
మాలనిపుత్త్రిలం దొకఁడు మాసినగుడ్డబుజానఁబూని వి
ద్యాలయమందుఁజేరె; నడితల్లి యెఱుంగదు; దారిఁబోవునే
బాలకులైనరమ్మనిరొ? వానికిగల్గెనో? కోర్కె విద్యపై.

కం॥ బడియందుఁ బగిలి నేలం
బడియుండిన పలకముక్కపైఁ గనులువడెన్
గడువడిగ దానిఁగొని య
క్కడి పిల్లలఁజూచి వ్రాయఁగన్మొదలిడియెన్.

గీ॥ ఫాలతలమునఁ బంగనామాలు వెలయ
దక్షిణకరమ్మునందు బెత్తమ్ము బూని
చిన్నినవ్వులు మోముపైఁ జిందులాడ
నాసనాసీనుఁడయ్యె నధ్యాపకుండు.

మ॥ కులనిష్ఠాపరతంత్రుఁడా గురువు; సంకోచించునశ్రాంతమే
కులహీనుం డెదురౌనొకో యనుచు; నెగ్గుల్వల్కి దూషించు మా
లలఁగన్నన్; గరుణావిహీనుఁ; డటమూలన్భ్యారిదై స్వస్థితిన్
గలవానిం దిలకించి "యెవ్వఁడవు? వక్కాణింపరా బాలకా!

గీ॥ కాదుగద! చెప్పరాని వంగడము నీది
కాఁడుగద! మాలవాఁడు నిన్గన్నవాఁడు

"చెప్పుమా" యన్న లేచి యా చిన్నవాఁడు
కన్నులన్నీరునిండ సిక్కరణిఁబలుక.

చం॥ గురువర! మాకులమ్మెఱుఁగ కూటికిఁగుడ్డకులేని పేదయా
నరుఁడొకఁడయ్యనాతఁడు; సుగుణమ్ములప్రోవు మదీయమాత, యి
స్పురమునకుత్తరానఁగల పూరికుటీరము మాది; అందునె
వ్వరమునుఁ జూడరా రొకట పాపము! పాములుదక్క నిద్ధరన్.

గీ॥ చెవులు చిల్లులు వడియె; నొచ్చెను మనమ్ము
గుళ్లురిసెఁ; మోము చిటిలించెఁ; గొరికెఁబండ్లు
గుండె పాషాణమయ్యె; నక్కఱ్ఱవానిఁ
గొట్టె దేహమ్ము వాయ నక్కుటిలబుద్ధి.

కం॥ సిరిపేద సుతులలో సు
స్థిరుఁడు వివేకమునఁ దెల్వితేటలయందున్
సరిలేనివాఁడితండా
వరమణియెరువున నొక్కడు వరలుట వినమే?

ఉ॥ కంటజలమ్మునిండ మెయికంపము చెందసనున్ గురుండ! యే
మంటిని? నేరమేది? మరియాదదలంపనె? నోరులేని నా
వంటి యనాథులన్ జెనకవచ్చునె? కీరితి; ముద్దుబిడ్డలన్
గంటివ? లేద? నీకడుపుకాలద? నీసుతుఁడిట్టులేడ్చినన్.

చం॥ కులమునఁ బేదవాఁడయినఁ గూటికిలేకతపించినన్ ధరా
తలమునఁగన్నులందుమముదాఁచుచుఁ బెంచుననుంగుఁదండ్రిదె
బ్బలు వాడఁగాంచి జీవములువాయఁడె? తల్లికి శోకమాగునే?
తలఁపఁగబాకుపోటులుగదా! తలిదండ్రులకాత్మజశ్రమల్.

గీ॥ అంటు, బెత్తమ్ము నందూరి యంటుచున్న
ఇంకెరక్తమాంసములఁ; గళంకమయ్యె
చనునె? దోసిమ్ము నీట మజ్జనములాడ
జలము స్వర్గస్థలమ్మిచ్చి సాకఁగలదె?.

చం॥ కరములు పాదముల్ శిరము కన్నులురమ్ముదరమ్ము నల్లకం
డరములు మాంసమొక్కటిగదా! జనపాళి; కనస్థలన్నియున్
సరియెగదా! యొకప్పుడిలఁజచ్చుట నైజముగాద? యీ బహి
ష్కరణమదేలరా! కులపిశాచికి నన్బలిజేయధర్మమా!

గీ॥ అనుచుఁ జెక్కుటద్దాలఁ దోయమ్ముజారఁ
జనియె నాకుఱ్ఱఁడప్పాఠశాల నీడి
పంతులయ్యకు భూరి విభ్రాంతిగలిగె
కూఁతగొప్పదిరా! పిట్ట కొద్దిదనును.

ఉ॥ ఇంటికివచ్చినంత జనయిత్రి కవుంగిటఁగ్రుచ్చి అయ్యొ! యెం
దుంటి? వొకండ విట్లు తడవుండఁగఁజెల్లునె? ఊరనెన్న డే
నొంటరిగాఁ జరింపకు, మయో! కులభూతముమ్రింగు నేమొ? నీ
వంటగరాని నీచకులమందు జనించినవాఁడ వాత్మజా!

గీ॥ తనకు జరిగిన దురవస్థఁ దల్లికనఁడు
చింతనము నేమొ? యంచు వాంఛిన్నవాఁడు
కడుపులోనుండియే, ధైర్య కవచమందె;
జననమొందిననాఁడె శాస్త్రములు సదివె.

కం॥ కూఁటికిలే వొకదినమునఁ
జేటప్పులభింపదందుఁ; జిన్నితనయు లా

రాటము జెందిరి; లేముల
బోటికి నిరుపేదకొంప పూఁదోఁట గదా!

ఉ॥ ఒక్కఁడు పొట్టకాలుననె; నొక్కఁడు తల్లినిఁబోరువెట్టు నిం
కొక్కఁడు తండ్రివెంటఁబడు; నొక్కఁడు కొంగుగరానఁబూను; వే
రొక్కఁడు కొంపలందిరుగు; నోపిక తల్లికిలేదు; తండ్రియున్
మ్రొక్కుఁ బరాత్పరాంఘ్రియుగమున్దళుకొత్తు నవీన భక్తిమై

కం॥ అడుఁగులకు మడుఁగులొత్తెదఁ
బడిమ్రొక్కెద; మనసువిచ్చి ప్రార్థించెద; నా
కడగండ్లెడలింపఁగదే;
తుడువవె, నాకంటినీరు దురితవిదూరా!

ఉ॥ పండినచేలలోఁదిరిగి భారమనాకయె కోసికోసి, క
ట్టెండకుఁ గాలికాలి, తిననేమిలభింపమి మాడి, వాడి, మా
ర్తండుఁడు గ్రుంకువేళకుఁ గరమ్ములుమోడ్చినవచ్చుకూలితో
నిండదు పొట్టయింక; మరణించినమేలుగదా! పరాత్పరా!

ఉ॥ ఇంపుగఁజేనుదున్నుటకు నేను; సకాలమునందుఁబంట పం
డింపగ నేను; కోయుటకు నేను; తపించి విశేషసౌఖ్య మి
ప్పింపఁగ నేను; అగ్రకులవీరులు నిర్దయనోరుగట్టి, నన్
దింపి రపారదుఃఖజలధిన్ గరుణింపవదేల? యీశ్వరా!

ఉ॥ పట్టరునీపదద్వయము; భాసనసేయరు; వారికన్నియున్
గట్టెదవేల? నిన్నుఁదమకంబునఁ గొల్చు దరిద్రపాళికిన్
బెట్టఁగఁజేతులాడ; విదిపెద్దలకిమ్మ? యశమ్మ? కానినిన్
దిట్టుదుగద్దితప్పగునె? దిద్దుకొనందగునయ్య! దైవమా!

ఉ॥ చెన్నగ సర్వభాగములఁ జేసి, తదీయ విధిప్రకారముల్
పన్నితినంచుఁ బొంగకు; ముపారములందుఁ దలంచిచూచితే?
అన్నములేక పస్తునడి యాకులు మేసి కృశించు పేదలన్
గన్నులఁ గానలేసి మొనగానితన మ్మది యేలరా? ప్రభూ ?

కం॥ ఇమ్మహిని నీవులేని స్థ
లమ్మే లేదన్న నిజములా ? మఱి, నా గే
హమ్మందు లేవుగద ! యిది
ముమ్మాటికిఁ గల్లగాదు ముల్లోకేశా !

చ॥ అనితఃపోయుతంద్రిగృహమందుఁ దపించు ననుంగుమాతలో
చనముల నీరునిండఁగ విషాదకవమ్ముల నేడి బువ్వ తె
మ్మను ననుజన్మలంగని మహావ్యథ జెంది, వివేకి చెచ్చెరన్
జనెఁ బురవీథులంబడి, బుజానఁగు చేలముదాల్చి దీనతన్.

కం॥ ధనవంతుఁ డొక్కఁడు దప్పురిఁ
దనయుని పెండ్లికనాథతండంబులకున్
దినఁబెట్టి పంపుచుండఁగ
మనవాఁడటకేగి యొదిగె మనుజుల నడుమన్.

మ॥ తనలోఁ దానిటులందలంచు" జనసంతానమ్మునం బెవ్వరే
ననుమానించెదరేమొ? లభ్యమగునో? యన్నమ్ము; కాదో గృహ
మ్మునమాతాపితలన్నదమ్ములు సుఖమ్మున్గాంతురో? లేదో? ఈ
దినభక్ష్యమ్మిడఁడో? పరాత్పరుఁడు మిత్తిన్ బంపునో? కొంపమున్

మ॥ వరుసల్ దీరినవారిలో నిలువనెవ్వారైన గుర్తింతురో ?
కరముల్ సాచి కులమ్ముఁ జెప్పఁబనిపిష్ణువమ్మానో? కాదేనినో

టరిగా నిల్చినఁజుల్కనౌ; మఱియుఁగష్టమౌ నను; భావింప నీ
శ్వరసంకల్పము సంఘటిల్లుఁ గరుణాసాంద్రుండతండే గదా.

కం॥ ఆలోపల బయటికి నిల
వేలుపొకండరిగి పలుకు "వినుడిందరిలో
మాలలకు లేదు; చెడవో కో?
మాలల కన్నమ్ము వెట్ట మా పుణ్యమ్ముల్."

కం॥ డోకలవా రుప్పర బుడ
బుక్కలవా రెఱుకవాండ్రు బోయలు చెంచుల్
మెక్కఁగనిడఁదగునఁట యితఁ
డెక్కవగాఁజేయుపాప మెయ్యదిరొయొ? గదా!

ఉ॥ అంతట గుండెఝల్లుమనెనప్పుసివానికిఁ; గంపమొందుచున్
జింతిలసాగె; నశ్రువులు శ్రేణులు గట్టె; ననస్యమూడ న
త్యంతభయమ్ముదోఁచె జనులందఱుజూడఁ దొలంగినిల్చి శ్రీ
మంతులఁగాంచి యిట్లు పలుమాఱు వచింపదొడంగె దీనతన్.

మ॥ మరణావస్థమునింగి పిల్లలును మన్మాతాపితల్ కూఁటికై
పరితాపమ్ము భరింపనైరి; కరుణన్ బాలింపరం? వారి; నీ
శ్వరుఁడానందమునొందుఁబున్న మగు; భాస్వత్సౌఖ్యమానింటని
త్తరి భేదమ్ములె? డీనరక్షణనచోర్ధమ్మింత బాటింపరా?

ఉ॥ పెద్దలలో నొకండు పసిబిడ్డఁ గనుంగవగాంచి కోపియై
"పొద్దున మాలవాని ముఖమున్గనఁగీ; డెద్దైన నద్దియా
పద్దినమౌను; పల్క ననుపాపము; నీ చరితమ్ము హీనమీ
విద్దెసనుండరాద" న సహింపని రోషముబూని తానమన్.

అదయుండా! నను(గన్నులారగని, నెయ్యమ్మొక్కప్పభాషించివా
కసురై యొందఱుకూలిరో? నరకమందే కష్టమానో? నచిం
చెడవే? యాఁకటిచేఁదపింప నొకపక్షిన్ జేసి నెట్టించు ని
య్యదియా? అగ్రికులపరిన ర్త్తనము; న్యాయమ్మన్న నిట్లుండునా?

చం॥ బడసితిజన్మ మీయొరుని పంపున; భారతమాతదుగ్ధమున్
గుడిచితి; పెంచె నీ ప్రకృతి కోమలదేహ; మనాదరాగ్నిచే
నుడికెద నేఁడు; నిర్దయత నూఁకిరిదీయు కిరాతులుండు ని
య్యెడసుఖమాని జీవులకు నిద్దరిణాత్ములు భారతీయులే.

చం॥ అనుచుం బరాభవాగ్ని హృదయమ్ము దహింపగ వారిధారగా
చనములు జిమ్మగన్ సగముచచ్చిన యస్పృశివాఁడు ఖిన్నుఁడై
వెనుకకు మళ్లె; నంతఁ దనవీపున గుడ్డలమూటబూని, య
ల్లనఁ జనుచున్న యొక్క ముసలమ్మను జూచి దయార్ద్రచిత్తుఁడై

గీ॥ అమ్మకో! నీకు లేరె? చుట్టమ్ము లెవరు
పెద్దదానవు; పాప! మోసికగతించె
అధిక భారమ్ము మోయు ప్రాయమ్ము గాదు
అనుచు నొక చిన్నమూట మూపునధరించె.

చ॥ ముసలిది స్వాంతమందునఁ బ్రమోదము జెందికుమార! పొట్టకై
విసువక చేతు నిట్టు కులవృత్తి; అనుఁగులు లేరునాకు; నే
డుసురులఁగాచితే వెనఁడవోయి! పవిత్ర చరిత్రుఁడైనయో
బిసరుహనేత్ర నిన్నుఁ గనిపెంచెఁ బ్రిపన్నుల రక్షణార్థమై

గీ॥ చిఱునగవులొప్ప నెవ్వరో చెప్పఁగాని
యనఁడు తనమాట పున్నెమ్ములబ్బనంచు

కొంపజేరిచి "తల్లి! యేగుదునన౦"గ
పొదిగిటన్ గుర్చిచ్చి పలుకు నమ్మనలివగ్గు

ఉ॥ చిన్నికుమార! నీవదనశీతమయూఖుఁడు చిన్నవోవు; నా
కన్నులఁజూడ నీకు నపకారమొకం డొనరించియుండు; ని
న్నన్నఖిలుండు రౌరవమునందుఁ దపింపఁడె? దేవుఁడుండఁడా?
అన్నము పెట్టెదన్ ఒక్కకేడంత భుజింపర! డొక్కఁనుర్చిఁగెడిన్

ఉ॥ మాలఁడనంచుఁ జింతిలకు; మాకవి లేవు; నిజమ్ము పల్కితే;
లాలితమా భవద్గుణములంగొనియాడెద; జాలిలేని యి
క్కాలపువారి దుర్నయము కామకపందును; రేపుమాపు న
న్నాఁ నజేసి పొమ్ము; తనయా! తినిపొమ్మికదానముండెదన్

గీ॥ అంచుఁబళ్లెంబునిండ వడ్డించె బువ్వ
ఆరగింపవెయనఁగ నిట్లను నతండు
"అమ్మరో! నాకుఁగలరన్నదమ్ములింట
కొంచుపోయెదనన్ను మన్నించుమమ్మ!

ఉ॥ తేఁటతెనుంగులంబలుకు తీయనిమాటలకుబ్బి, తండ్రి, నీ
బోఁటికుమాగరత్నమునుబొందినతండ్రి; విచారమేల? యిం
కేఁటికిశాభయమ్ము; మనకేమితఱుంగని వేఁడియన్నమున్
జేఁటుగట్టిపొమ్మ"నినఁ జేతులుమోడ్చి వివేకియిట్లనున్.

ఉ॥ ప్రాకటకీర్తిశాలినివి; భారతదేశనరిద్రపాళిక
స్తోకసుఖమ్ములంగురియఁ దోఁచిన తల్లివి; నీమొగమ్ము నా
లోకముచేసినందొలఁగు లోపములన్ని దయాపరిపూర్ణవై
యాఁకటిచిచ్చునార్పితిగదమ్మ! విశాలపరోపకారిణీ!

సీ॥ కులదైవతము పంచముల మ్రింగిజీవించు
స్థలమందు వెలయు సత్కులజ నీవు
స్వార్థభూతముజనవ్రాతమ్ము గబళించు
క్షితివెల్గు ధర్మదేవతవు నీవు
నీతిపిశాచమ్ము నెత్తురు ద్రావి చెలరేఁగు
మహిఁగీర్తి గనువీరమాతవీవు
పేదగుండెలు వండి పెద్దమ్మతినెడు ధా
రుణి రహించు నుపకారిణివి నీవు

తే॥ గీ॥ భాగతాంబ భవన్ముఖ పద్మసీమ
తాఁడవింపఁగఁ గందు నుత్తమచరిత్ర
కారణములేని నీప్రేమకై నుతింతు
కరుణగలతల్లి ! దీనుల కల్పవల్లి!

# బ హి ష్కా ర ము

## ద్వి తీ యా శ్వా స ము



ఉ॥ అంతకుమున్న మిన్ను నభయంకర మేఘముగ్రమ్మె; నందుభా
స్వంతుఁడుమాయమయ్యెఁగడుచల్లఁగవీవఁదొడంగెగాలి, అ
య్యింతికిఁజెప్పి దారిబడెనింటికి పెద్దగవానసాఁగె; నా
చెంతననున్న సత్రమునఁ జేరి వసించె వివేకి చెచ్చెరన్.

ఆ॥ మున్నుదానఁజేరియున్న పెద్దలుగాంచి
ముక్కువిఱిచి దూరముగఁ దొలంగి
గొణుగుచుండ, నొదిగెఁగుఱ్ఱవాఁ డొకమూల
ఆయిన విసువకను మహాత్ముఁడొకఁడు.

ఆ॥ కట్టినాఁడె? నిన్నుఁగన్నవాఁడీయిల్లు
ధనమునిందు మున్ను దాచినావె?
ఎవరు బిలిచిరిచట? కేలవచ్చితివీవు
మాలలకును సత్రమా? ధరిత్రి.

ఆ॥ వానయైనఁ జెద్దవడగండ్లురాలిన
పృథివి పగులునట్టి పిడుగులైన
వరదలైన మిన్ను ధరపైనఁగూలిన
పంచఁద్రొక్కరాదు పంచముండు.

ఆ॥ మాలమాదిగలకు మరియాదలే లేవు
కడుపునిండ నన్నఁ గనులు వోవు
ఊరిబైట నూరు పేరులేక వసించు
ప్రజల నేల జేసె పద్మభవుఁడు.

ఆ॥ కులములేని వీరు కూలిపోయినదాక
భరతమాత కెందుఁ బరువు రాదు
మాలమాదిగలను మాఱి మ్రింగినదాఁక
శాంతి దొరకదగ్రజాతులకును.

కం॥ పలువురు పలువిధముల నిం
దలు వల్క సహింపరాని దావానల కీ
లలు రేగఁ జొచ్చె మనమున
గలఁగుచు నిట్లను వివేకి కన్నీరురలన్.

శా॥ నాలోనున్న పిశాచమే ప్రజలకంఠశ్రేణిఁ జెండాడు; చం
డాలత్వోగ్రమృగేంద్రుఁడే ఘనులనల్లం ద్రావి జీవించు నీ
మైలం జచ్చినవారి గేహములు నిర్మానుష్యమై దయ్యముల్
పాలింపన్ గడుభీతిగొల్పునెట; మాలం డౌర! కాలుండొకో

సీ॥ పరుని సంపద సహింపఁగలేక దయమాలి
పిలిచి ఖడ్గమునఁ జంపినది లేదు
పర మతజాతి కోపము డెందమందూని
నిరపరాధులను జెండినది లేదు
దేశనాయకుల వృత్తిన్బూని సామాన్య
జనుల రక్తమ్ము లానినది లేదు

మాయవేషమున దొమ్మరులిండ్లలో దూరి
కనుమూసి నీతి దప్పినది లేదు

ఆ॥ వె॥ పగలు రేయి యనక పలు కష్టములజెంది
పూరిగుడిసెలందుఁ బ్రొద్దుబుచ్చు
చిర దరిద్రమూర్తి చేసిన తప్పేమి?
ఇట్టి ద్వేషభావమేల? కలిగె.

క॥ అంత డెందములన్నరకాగ్ని రగిలె
కసరి దూషింతు రకటఁ నిష్కారణముగ
వాన కొంచెముతగ్గ నవ్వారిపిడి
నడువసాగెను వడిగ నన్నంబుఁ గొనుచు

ఆ॥ అన్నదమ్ములెల్ల నాఁకటి చిచ్చుచేఁ
మాడిపడిరి కుక్కమంచమందు
కడుపునిండఁ గనిన కొడుకుల కడగండ్లు
చూడలేక పితలు చొక్కపడిరి.

కం॥ కడు సంతోష మొప్పగఁ
గుడిచిరి యన్నము వివేకిగూడ భుజించెన్
పడరాని బాధ లివ్విధిఁ
బడుచుఁ దపించెదరు గడచెఁ బదిరెండేడుల్.

సీ॥ తన దేహమాంస రక్తముల విందులుచేసి
కుల భూతమునకు మక్కువనుగూర్చి
తన యస్థిపంజరమ్మును పిండిగావించి
భక్షింపలేమి దేవతకొసంగి

తనదు కన్నీటి సంద్రముల మజ్జనమిచ్చి
సర్వ లోకులకు విశ్రాంతి సలిపి
తన సుఖస్తోము మప్పనజేసి పస్తుండి
స్వార్థ కాంక్షులకు భోజనము పెట్టి

ఆ॥ తన విహీనదశను దైన్యస్థితిదలంచి
కారణమ్మెఱుంగు దారిలేక
చెలువకొడుకులింట జీవచ్ఛవముఁగాచు
కూలఁగలత జెందు మాలవాఁడు.

ఆ॥ అంతపేదవాని యాత్మజులందొక
వ్యాధిచేనొకండు బాధజెందుఁ
తల్లిదండ్రులన్నదమ్ములు తగురీతి
నాదరింత్రు సుంతరాదు సుఖము.

ఉ॥ తిండికిలేనివారిఁగనెఁ దీవ్రతరజ్వరరాజు, మందులె
వ్వండిడు డబ్బులీయక; నివారణమెట్లగు? నొక్కనాటు వై
ద్యుండిడి పెద్దరోగమనె దుఃఖపయోధిఁ దపింతురందరున్
గుండెలు బ్రద్దలై జననికూలుగృహాన భయంకరార్భటిన్.

ఆ॥ మాలకుఱ్ఱవాఁడు మరణించు నని యూరఁ
బెను పుకారుపుట్టె జనులయందు
పేదవానికొంప పెద్దజబ్బుల కునికి
లేములమ్మ చేయలేనిదేది ?

ఆ॥ ధర్మవైద్యశాల దాపున గలదంచు
విని వివేకి నడిగఁ జనియెనటకు

అందు మందులిచ్చునట్టి వైద్యునిఁజేరి
చేతులెత్తి వెతలు చెప్పుకొనియె

కం॥ పదియో? పరకయొ? యిచ్చినఁ
గుదురును రోగమ్ము పట్టికూతలకగునా?
అదిలేని మఁదు పనిచే
యదు పొమ్మనె వెజ్జునిర్దయాశీలుండై

శా॥ అయ్యా! తమ్ముఁడుమిత్తినోటఁబడి గేహమ్మందునల్లాడు చుం
దియ్యం జెల్లు; పరోపకారమిది; యిల్లేలేని నిర్భాగ్యుఁడన్
నెయ్యమ్మొప్పననుగ్రహింపఁగదె; పున్నెమ్మౌను. మీకందరున్
వెయ్యేన్నూటపదారులిచ్చెదర? డబ్బే, శాశ్వతమ్మా? యిలన్

గీ॥ నేఁడు తినుటకులేక రాపాడఁబడుదు
గుడ్డిగవ్వయులేదు నిక్కువము తండ్రి!
మేలు మరువను; ఈ తెప్పతేలవలయు
లేచిన న్నీ ఋణమ్ము చెల్లించుకొందు.

గీ॥ చాలు! పో! డబ్బులేక యౌషధము గలదె?
దానములుసేయ మేము దాతలము గాము
నాకు నీవల్లగలుగు పుణ్యమ్ము వలదు
పొమ్మనుచు వైద్యుఁడటనుండి పోయెనకట!

ఆ॥ నేతిబీరకాయ నేతికి సరిపోవు
సకలధర్మవైద్య శాలలిపుడు
ధర్మమింతలే; దధర్మమెన్మిదికాళ్ళ
రేఁగినడచుఁ బవలు రేయి గనక.

కం॥ అనుకొనుచుఁ దనగృహమ్మున
కును జనునెడ నొకఁడెదురుకొని "యోరీ! నీ
యనుజుఁడు కాలముసేసెను
తనువస్థిరమెల్ల జీవతతులకు ననఁగన్.

కం॥ బిరబిరఁజని పీనుఁగ నిఱు
కరములఁగొని తల్లడిల్లుఁ గడుదుఃఖముచేఁ
బొరలాడు నేలపయి త
త్తరపడు; జనపాళి గాంచు దైన్యముఖమునన్.

ఆ॥ చూచువారి కెల్ల శోకమ్ము జనియింప
సొమ్మసిల్లి రన్నదమ్ములకట!
మాటలేక పడిరి మాతాపితలు మూల
కొడుకు చావు కడుపు కోతగాద?

ఆ॥ పేదవాఁడు పొందు ఖేదమ్ము పొడగాంచి
జాలిపడరు పెద్దజాతివారు
చచ్చువాఁడుగూడ నెచ్చుతక్కువ లెంచు
ఖలుఁడు హైందవుండుగద! ధరిత్రి.

ఉ॥ పిమ్మటఁ బీనుఁగంగొని తపించుచుబొందకు జేరి, దానిలో
దమ్ముని దాఁచిపెట్టికొనెఁ; దక్కినదీనసహోదరాళిగే
హమ్మునఁ జేర్చిగాసి, హృదయమ్ముకలంగుటచే. వివేకి వే
గమ్ముగఁ దత్సమాధికి నెకాయెకి నేఁగి వచించు నిర్వ్యథిన్.

శా॥ ఓయీ! ప్రాణసమానుడైనయను, నిన్నుర్వీస్థలిం గాంచి నీ
కైయాత్మీయసుఖమ్ముల న్బలిగనీయంబూనుతండ్రిన్ దలిన్

బాయంబోలునె ? దుఃఖవారిధులఁజంపఁజెల్లునె? ఇద్ది యూ?
న్యాయమ్మన్న; భరింపరానికష్టదైన్యమ్మయ్యెరా! బాలకా!

శా॥ పోనీ! నిన్నొకమాట నేనడుగనొప్పన్; సత్యలోకమ్మునన్
వాణీనాథునిఁజేరి పంచముల సర్వక్లేశమున్ దెల్పి, యీ
హీనవ్రాతము నేల చేసెనో? సుఖంబెన్నాళ్ళకో? యెట్లొకో!
తా నేదీనికిఁగారకుండో? ఒరులో? తమ్ముండ! ప్రశ్నింపుమా!

చం॥ విరసమునన్సరస్వతియు, ఏరననిప్పులుగ్రక్కు పంచముల్
నరులని మొన్ననే తెలిసె; నవ్యకవిత్వరసప్రవాహమున్
గురిసెడి నూర్వైరెంటగల కొంపలు నేటికి; నామెనీకు సం
బరపడు; నిద్దరొక్కట, సభాస్థలినుండఁగఁ జూచిపోగదే.

ఉ॥ వారిజసంభవుండుడిగెఁ బ్రాయమున, న్నినుఁగోపగించునో?
సారెకు; భీతిఁజెందకుము; సత్యముదేలినదాఁక రాక వి
స్తారముగా వివాదములు సల్పుము; కానియటన్ ద్రిలోకసం
చారికిఁ గంటిలోఁబడకు, శాంతివిరోధియుతండు తమ్ముడా!

ఉ॥ అంతట నంబుజోదరుని యండకుఁబొమ్ము; తఁడిచ్చునంట వి
శ్రాంతి సమస్తజీవులకు, సర్వజగమ్ములనేలునంట; అ
శ్రాంతముదుఃఖవార్ధులఁ గరమ్ములుమోడ్చిశ్రమించువాఁ తా
నెంతగ నేలెనో? యడిగియేమిజవాబిడునో? గ్రహింపుమా.

కం. ఎండినయాకులవలె నిలఁ
దిండికి మాలలువటించి త్రెళ్ళుటలేదా ?
గుండెపయిఁ జేతినిడికొని
యండజవాహానునిఁ జెప్పుమని వేడఁగదే.

కం. కులముగలవారి కాంపుర
ములఁ బూర్ణసుఖప్రసూనముల విరజల్లున్
పిలిచినఁ బలుకదు మన మన
సిలుఁగులకెల్లన్ గతమ్మ సిరియని చెపుమా!

మ॥ పరిపాలించెడివానిభార్యయొకనిన్ బల్మారు ద్వేషించినన్
సరియే? నీవును జెప్పలేవుగద! విన్నావె? యీమాత్రమున్
సరిగా భార్యకుఁజెప్పలేని వెనుకోచల్ సర్వలోకమ్ములన్
పరిపాలింపఁగ నేర్తురే? యనుచు సంభాషింపుమా! ధీరతన్

ఆ॥ అసుల సంహరింప నవతారములఁ బూని
నందు రద్ది సత్యమౌనా? కాదా?
పంచములను శాంతిపఱచిన రూపాల
లెక్కజెప్పుమనుచు నొక్కియడుగు.

ఆ॥ దేవెయన్న నెగిరి తీవ్రకోపము బూను
చింతవలవ; దేమి చేయఁగలఁడు?
భరతఖండమందు నరకబాధ సహించు
నరులకింక పెద్ద నరకమున్నె?

కం॥ బాలక! తదుపరి గనుమా!
కైలాసమునందు మూఁడు కన్నులవానిన్
మాలలు పడు సంతాప
మ్మాలించుమటంచుఁ బలుకుమా! గిరిజవినన్.

ఉ॥ పంచమజాతి నేఁడు పడుబాధ లెఱుంగునొ? లేదొ? కారణం
బెంచెనొ? యెంచడో? తుదను నెల్లరనీతఁడు కోర్కిదీరఁ గాచుఁ జం

పించుటగల్గునంట; కడుపేదలఁగాంచి రవంతజాలిజూ
పించునొ? లేదొ?వానివిడిపించక సర్వమెఱుంగుటేమ్ముఁడా.

ఉ॥ గట్టులపై వసించుఁ గఱకంఠుఁడు; సర్వవిధౌషధంబులన్
జెట్టులవన్యమూలికలఁ జేదులనెల్ల నెఱుఁగనోపెడిన్
గుట్టుగ మాలమాదిగలకుం గలరోగము మానుమందు లా
గట్టులతేనియల్గుఁ డొసఁగంగలఁడే మొ?దొకింత వేడుమా.

ఆ॥ పలుశిరముల నాగుబాము నిమ్నజపాళి
తినఁదొడంగె బ్రతుకుదెఱువు లేదు
పాములతేఁడు వాల్చు బంగారునగలంట
అడుగు మంత్రిమెద్దియైనఁగలదొ?

చం॥ పరుసగపంచభూతములు వారిజబంధుఁడు వారిజారియున్
హరిహరపద్మసంభవు లు కడని సర్వసమత్వ ధర్మమున్
నెఱపెడు; నీచతోచ్చతలవిష్ణలుమాని; త్రిమూర్తులింకసా
గరమున వేయనా?యని మొగమ్ములువాడ వచించరాగదే.

గీ॥ అట్టులనుకొను సమయమ్ము నందునెవరొ ?
పసుకన్నగినట్లు విభ్రాంతిదోఁచె
అగ్రరాత్రిమునన్ బొందలందెవండు
తిరుగు? మిత్రియెయని దానిఁ దిట్టునిట్లు.

ఓసీ! ముండ! భుజింపనింతమెతుకా? ఉండన్ గృహమ్మా? సదా
దాసత్వాగ్నిఁ దపించుమాపయినఁ గ్రోధమ్మేల?సాధమ్ములన్
వాసమ్మొండె, దరిద్రులన్మెసఁగు నెవ్వారైనఁ గన్పింపరా?
దోసమ్మింతయు లేనివానిఁదిని సంతోషింతువా? యక్షిణీ.

ఆ॥ ఎచటఁ బుట్టినావో? ఎవ్వాఁడు కనిపెంచె?
సకలజీవతతులఁ జంపు టేల?
ఉందువెందు? నిట్టి యుద్యోగ మెవఁడిచ్చె?
మీకనుంగులెవరు? మృత్యుదేవి?

ఉ॥ నల్లని చీరెగట్టి వదనమ్మును విచ్చి, శిరోజపాళి మే
నెల్లపరంజ, గుడ్లురిమి, యెఱ్ఱనినెత్తుటిచాఱ లొప్పఁగన్
బెల్లుగభీకరార్భటుల భీతినిఁగూర్చి శరీరధారులన్
జల్లఁగమ్రింగుచుందువు;విచారము సేయవు మంచిచెడ్డలన్.

ఉ॥ ఇందరినారగింతువుగదే, మఱియెన్నడజీర్ణబాధ నా
క్రిందన మొందవేమి?యుదరంబుననౌషధముందునేమొ?ని
న్నెందరు? తిట్టిరివ్వసుధ; నేలగతింపవు; సిగ్గులేని యో
బొందలరాణి! నేఁడు వలపోసెడి నన్నగతాళిజేతువే?

శా॥ ఏనాఁడెందరు నిన్ను జేరుటకు నేయోదారులం గాంతురో
ప్రాణాలెట్లు త్యజింపఁగావలెనో? సర్వక్లిష్టకాండమ్ము, నా
స్థానమ్మందువసించివ్రాయఁగ గుమాస్తాలుందురే? యిత్తువే?
నానెమ్మల్? మఱిముద్రలెవ్వరివి?చానా? నీవిదైయుండవా?

గీ॥ లాజరనువాఁడు నిన్ను మేలమ్ములాడి
గర్భముంజీల్చికొనివచ్చు గాథ వినమె?
కోఁఱలు పటుత్వమెక్కింత కోలుపోయె
కానిచో నిన్నుబట్టఁ బగ్గాలుగలవె?

మ॥ తులలేనట్టి విశుద్ధవర్తనుఁడు క్రీస్తుస్వామి నిన్బట్టి యం
ఘ్రులతోఁదన్ని తృతీయవాసరమునన్ గ్రొమ్మెన్నసనూత్నవిభా

కళ రాజిల్ల సజీవుఁడైనకతనిక్కమ్మెగదా! నాఁటినీ
తలవంపుల్ గని నవ్వకుండు నరుఁ డిద్ధాత్రీస్థలిన్ గల్గునా?

గీ॥ నీకు నెన్నఁడు రావు కన్నీటిబొట్లు
దుఃఖితులమంట నీకెట్లు దోఁచు చెపుమ!
ఎట్టితపసులు సల్పి మెప్పించినావొ?
చావు లేకుండఁజేసె నీశ్వరుఁడు నీకు.

గీ॥ ఇట్లు మరణదేవతను నిందించి యలసి
కునికి నిదురించెఁ దొలికోడి కూయుదాఁక
నిదురలో నెవ్వరేమేమి నేర్పినారొ?
మగుడ మిత్తినిఁబిల్చి యిమ్మాడ్కిఁ బలుకు.

గీ॥ తల్లిరో! పేదపైనఁ గ్రోధమ్ము వలదు
కోపతాపానఁ బల్కు వాక్కులు గదమ్మ!
భారతావని నాకు శాపమ్ము లిచ్చు
దిద్దగలవంచు నిన్ను నర్థించినాఁడ.

మ॥ జననీ! సర్వవిశాలలోకమున సంచారమ్ము గావింతు; వెం
దునఁగాని, దయమాలి పేదలను గొంతుల్ గోసి, తన్మాంసభో
జనముం జేయు కసాయిలుందురె? బహిష్కారాగ్నిలో సాటివా
నినిదగ్ధమ్మొనరించు నిర్దయులఁగంటే? వింటె? వాక్రువ్వుమా.

గీ॥ ఎచ్చటెచ్చటఁ బ్రాణి జీవించుచుండు
నచ్చటచ్చట నీరూప మరయవచ్చు
నీకుఁదెలియని చేతనానీకమున్నె?
గాంచితివె? మాత! నావంటి కష్టజీవి.

గీ॥ బహుపురాతన పాతాళభవనమందు
గలఁడు మావాఁడొకండు భాస్కరునికొడుకు
అతనికై రాజపెట్టిన యగ్నికీల
లారలేదింక ననిచెప్పనమ్మ జనని !

మ॥ కులభేదమ్ములు నీచతోచ్చతలు నీకున్లేవు; నీరాజ్యవా
సులు స్వార్థమ్ము గణింపరెన్నటికి; నస్తోకైకసౌభాగ్యవాం
ఛలు నున్నల్ గద! శాంతికేతనముల శాంతమ్ముదూగా ముని
ర్మల దేశానికిఁ జక్రవర్తినివి; ధర్మమ్మిమ్మంముఁ జూపట్టునన్.

ఆ॥ తెనుఁగుతల్లి మెడకు ఘనమైన నగలెల్ల
నిచ్చి నిన్ను జేరె; కృష్ణరాజు
అష్టదిగ్గజాల కాటలు నేర్పించు
నిపుణుఁడమ్మ ! మంచి నీతిపరుఁడు.

ఆ॥ గండపెండియరముఁ గాలికిఁ గలవాఁడు
పసిఁడి పల్లకీలపై దిరుగును ?
నేఁడుకై తలల్లు నిమ్నజుండను మాట
మఱచిపోకచెప్పుమా ! సవిత్రి !

ఆ॥ గాంధినాయకుండు కరుణాలవాలుండు
మమ్ముపైకినెత్త నమ్మతించె
గొప్పదొరలనింక నొప్పింపఁగాలేక
చిక్కులొందువానిఁ జేరకమ్మ !

ఆ॥ ఈశ్వరునికి నీకు నెనఁగుబంధుత్వమ్ము
నాయకులనుఁ గూర్చి నచ్చజెప్పి

మాకు మేలుగలుగు మార్గమ్ములంజూపి
బ్రోవఁజెల్లునింకఁ బోయివత్తు

గీ॥ అంతనింటికిఁజేరి ధైర్యమువహించి
తనపితలను సోదరుల నోదార్పఁబూనె
అప్పుడొక్క బిచ్చగాఁ డన్నమనుచువచ్చె
అశ్రువులురాల వానికి ననువివేకి.

ఉ॥ పాలును పాయసంబు గడుపారమెసంగి పసిండిమేడలన్
జోలలుమ్రోగ నుయ్యెలలఁ జొక్కి పరుండెడివారు లేరె? ఈ
మూలకుటీరమందొదిగి ముద్దులతమ్ములఁ గోలుపోయి,మం
చాలకుఁబట్టి మూలిగెడి సర్వదరిద్రుల మమ్ముఁగంటివా ?

చం॥ మురియుచు గజ్జెగట్టి సిరిముండభజించు నసత్యవాదులన్
కరుణముబూని యీయినుపగజ్జెలతల్లి నటించుచుండు; నె
క్కరణిని తృత్తులారు; నదిగాక తరమ్ములనుండి యీబహి
ష్కరణమునన్ దపించుమనకా? సుఖమాటసుహృజ్జనాగ్రణీ.

సీ॥ అస్పృశ్యతాభూత మఖిలబహిష్కార
చిరభీకరాగ్నిఁ గాల్చినదిగాక
తమినిర్దయాస్త్ర శస్త్రములదేహముఁ జీల్చి
శ్రీమంతులాహరించినదిగాక
చెలఁగినట్టింట లేములతల్లి కడుపార
నెత్తుటిధారలానినదిగాక
స్వార్థకాంతులు శల్యపాళి పిండిగఁజేసి .
మనసార నారగించినదిగాక

ఆ॥ వె॥ చిక్కి యూగులాడి జీవించునదిగాక
మృత్యుదేవి నేఁడు మ్రింగఁబూనె
బ్రతికి యేమిఫలము ? భగవంతుఁడా ? లేఁడు
దీనజనుల కెందు దిక్కు లేదు.

గీ॥ అంతనొక పుణ్య గేహిని నన్నమడిగి
వాఁడు భక్షింపనిడి పంపివైచినాఁడు
ధనికు లెఱుఁగని నిర్మల ధర్మగుణము
జ్యోతియై వెల్గు నిరుపేద జోలెయందు.

# బహిష్కారము

## తృతీయాశ్వాసము



గీ॥ కాలదేవత మించిన కరుణగలది
కంచుదీపాలఁ గనిన లోకమున లేదు
విపులదుఃఖము మాన్పి నవ్వింపఁగలదు
ప్రియజనవియోగమును మఱపించఁగలదు.

సీ॥ దుఃఖవారిధుల సంతోషాంబుధులఁ జేసి
యోఁతలాడించు నయ్యిందువదన
అనలమ్ముఁ బుష్పపర్యంకమ్ముగ నొనర్చి
నిదురగల్పించు నా నీరజాక్షి
కాలాహివిషము చిక్కని సుధమ్ముగ మార్చి
కడుపారఁ ద్రాపు నిక్కమలనేత్రి
ధూళిజీవులకు క్షుత్తులు వాపగాఁ జేసి
బ్రతికింపఁజాలు నిప్పంకజాక్షి

తే॥ గీ॥ కష్టములలోనఁ జూపు సౌఖ్యములకుప్ప
లేమిలో నిల్పఁగలదు కల్మిన్ ధరిత్రి
అదియొనర్పగరాని కార్యములు లేవు
దానిగర్భానఁ గ్రొత్తవింతలు జనించు.

శా॥ ఆలోకించి జగమ్ములన్, గగనముపై నాడించెడిన్; గొందరిన్
దూలించున్; సుఖమిచ్చుఁ గొందరికి; సంతోషమ్ముఁ జూపించి ని
ర్మూలించున్ దెసపైని బొమ్మలవిధమ్మున్ బొందుఁ బ్రాణుల్ సదా
వేళాసుందరి గారడీపనులు గావించున్ ధరామండలిన్.

గీ॥ దాని మాయలో మునిగి యందరును గూడ
మఱచిరకట భీకర మరణగాధ
తొంటివిధి లేములవ్మ కౌతుకము జెంద
నిత్యమారగించెదరు కన్నటితిండి.

ఆ॥ తనపసత్తులందుఁ దనజాతివారెల్ల
పాలివారలనెడి పలుకులెఱఁగె
సదయుఁడైవివేకి జాత్యుద్ధరణదీక్ష
బూనితిరుగు సకల భూములందు.

ఆ॥ రాజవీధులందు రచ్చల గల్లీల
జనులు వినఁగ ననువిషాదగాధ
భావిభంతలక్ష్మి పంచిపెట్టఁదలంచు
పసిఁడిమూఁటఁ గూర్చి పలుకునిట్లు.

పులుఁగులు కూయసాఁగెఁ; దనపోతును గూడెను జక్రవాకియున్
కలువ తపించు; డాఁగెను మృగంబులు; కంజరసమ్ముఁ దేనెటీఁ
గలు కడుపారఁ ద్రావు; నవకాంతుల శోరవి దోఁచె; లెమ్ము ది
క్కులు తెలవారె; నీసుఖముఁ గూర్చి తలంపుము భారతీయుఁడా.

ఉ॥ దూరపువాఁడు చిక్కులతో నినుగట్టెను; భారతాంగనా
శ్రీకము గ్రోలి మెంపుగ సుఖించెను; నిన్బరిహాసమాడెఁ; గ

స్నేరుపయోధులైనను గణింపరుధర్మము; నేఁడుకోర్కెలీ
డేరెఁ; జిరోరుసౌఖ్యముగడింపఁదలంపుము భారతీయుఁడా.

ఉ॥ ఖద్దరుఁగట్టి గేహముల గాంధిమహాత్ముని బొమ్మవెట్టి, యే
శ్రద్ధగను గొంతురాయఁగను బొబ్బరబెట్టినఁజాలదోయి? నీ
పెద్దలనాఁటి రాజ్యములభించు తెఱంగు దలంచి దానికై
గ్రద్దనఁగత్తిబూని సమరస్థలినిల్వుము భారతీయుఁడా.

చం॥ హరుసమరమ్మునన్ గెలుచునంతటివీరుల జన్మభూమిలోఁ
బిఱికితనమ్ములా? చనదు; వీరుఁడవై స్వజనాళి, దేశమున్
బరమసుఖమ్ములందనిపి పాలనజేయుము; కానినాఁడునిన్
దరుణులునవ్వరా? మనకుదాస్యముకూడదు భారతీయుఁడా.

చం. స్థిరముగ మంచుకొండయొక తేరయి రాజిల, భారతాంబయున్
బురుషుని వేషమూని ఘనువుంగొన, హైందవనూత్నచండభా
స్కరుఁడగు నెహ్రుపండితుఁడు సారథియైన, నరాతికోటివో
త్కరములదేమి లెక్క; త్రిజగంబులునీయవి భారతీయుఁడా.

ఉ॥ శాశ్వతసౌఖ్యయోధుల స్నానములాడను; జాలిబూనిస
ర్వేశ్వరుఁడిచ్చె నేఁటికి; బుధేంద్రుఁడు గాంధిపవిత్రధర్మముల్
విశ్వజనాళి నిన్నును వేకిఁ జేయుఁ; స్వమానమునకై శరీ
రశ్వసనమ్ములిమ్ము, విధిరా! యిదినీకిల భారతీయుఁడా.

ఉ॥ కట్టడజేసి మానవులు కారగ్న భారతలక్ష్మిదుర్గమున్
మట్టుగమీరు గోలుటది మంచిదిగాదు; స్వరాజ్యసౌధమున్
గట్టుటలోనఁ దోడ్పడి సుఖమ్ములఁగూర్తుర; మాలమాదిగల్
కట్టకకోటరా! విజయకారణభూతులు భారతీయుఁడా.

ఉ॥ లెక్కకు నేఁడుకోట్లు గతిలేనిదరిద్రులు, వాడివత్తులై
చిక్కనికంటినీరురలఁ జింతిలువారు; దయావిహీనులై
మొక్కినఁ జేరనీయక విరోధముబూనుట కీడుసుమ్ము; ఈ
చిక్కులు కారణాలు మనసేనకవృత్తికి భారతీయుఁడా.

ఉ॥ అన్నము వెట్టకుండినను నంటఁగనీక బహిష్కరించినన్
గన్నయమ్మంగుతల్లి పలుగాకులఁజిక్కిన నోర్వలేక శౌ
ర్యోన్నతి జూపి యీప్సితమునొందెను; నేఁటికిబల్లెనాటిఁగో
కన్నమదాసుపౌరుషఁపుఁగాంతులుమాయవుభారతీయుఁడా.

చం॥ కులమతభేదముల్ మనకుఁ గొంపలుదీసెర; తల్లవారిసే
వలకవిదారిదీసె; నిరవద్యదయారసపౌరుషాదులున్
దొలఁగెఁ; బదార్థసంగ్రహణతోషణమెచ్చెను; నేఁటికైననీ
కలుషములాపవేని సుఖకాలములేదిఁక భారతీయుఁడా.

చం॥ ఒకరినొకండుపట్టుకొని యూపిరిదీయఁదొడంగె; ఘోరపా
తకమనుమాట ప్రాతవడె; దారుణహత్యలు లెక్కలేదు; గాం
ధికిజయమన్నవాఁడతని నీతిదలంపఁడు; లాభమేమి ? బూ
టకములుమాయవేషముకటా! సుఖమిచ్చునె? భాగతీయుఁడా.

చం॥ వరుసగరాష్ట్రనాయకులు స్వార్థమున న్విపరీతవాదముల్
జరుపఁదొడంగినారఁట విచారము; పేదలుతిండిలేక బం
ధురపరితాపమొందెదరు; దుశ్శకునమ్మగురా! స్వరాజ్యసుం
దరరథమొడ్డిగిల్లునో? గదా! కరమొడ్డుము భాగతీయుఁడా.

చం॥ తరములనుండి లంచములతల్లి వసించెడిద్వారమందు; మం
దిరమునఁ జొచ్చెనేఁడు; నిజతీవ్రతరేక్షణ మార్గణమ్ములన్

బురములఁగాల్చి పేదలకు బూడిదబూసి నటించు; దీనిసా
గరమునఁ ద్రోయుదాఁక మనకష్టముతీరదు భారతీయుఁడా.

గురుమణిభూషలన్ బసుపుఁగుంకములన్మెయిఁదాల్చి రత్నభా
సురమకుటమ్ము మస్తమునశోభిల దండముఁబూని హైందవో
త్కరముల నేలు; నాఁడరులధ్వంసము జేయుచు పుణ్యభారతో
ర్వరపదిదిక్కులందు పహరాసవరింపుము భారతీయుఁడా!

గీ॥ ఇట్లు బలుకుచు రాష్ట్రమ్ములెల్లఁ దిరుగు
ఉగ్రుఁడై స్వామిదూతయు నొక్కొక్కమారు
ఉడుకుచును జాతిఁదిట్టు నొక్కొక్కమారు
కలతజెందుచుఁ జింతించుఁ బలువిధముల.

గీ॥ అంత నొకయూరు జేరె నయ్యంత్యజుండు
గుంపులుగ జనులందందుఁ గూడియుండఁ
గారణము సెప్పుమనుచు నొక్కనిని వేడె
విపులముగఁ దెల్పెనతఁడు వివేకికిట్లు.

మ॥ గుడిలోదేవుఁడుమాలమాదిగలమ్రొక్కుల్లేక దుఃఖాబ్ధిలోఁ
బడె; నీసంగతిగబ్బిలాలో? అతఁడో? వ్యాళమ్మొ! పూజారియో?
నుడివెన్ దేశములేలువారి; కట సంతోషమ్మునన్వారు క
ట్టడిచేయన్ [illegible] ములు గ[illegible]ల్ గట్టుచున్నారొగిన్.

కం॥ క[illegible]మున నాతఁడు చె
ప్పిన [illegible]ల నాలకించి వేగమ్ముగ న
క్కడివారి గూడి యిట్లను
గుడిమండపమందు స్వామిఁ గుదురుగఁగనుచున్.

చం॥ తరములనుండిలేని సమధర్మము దీనదయారసమ్ము లే
క్కరణిజనించెనీకు; బహుకాలము మాఱనిరాతిగుండె నె
వ్వరు కఱగించినారొ? గుడిబైటనెకాని నసింపరాని మ
మ్మరిముకిగౌరవించి మరియాదలుచేసెద వేల? దైవమా.

కం॥ పూజలకై పిలిచెద వీ
రోజుల పున్నెమ్ములా? విరోధులు నగిరా?
రాజాల సుఖములన్నియుఁ
బూజారికి దక్కెనవఁడు పొందెనొ? చెపుమా!

గీ॥ కలిమిభోగమ్ము లగ్రజాతుల కొసంగి
మమ్ముఁగూఁటికిఁ జంప న్యాయమ్మె నీకు
నేఁడు తుత్తులు వాపి మన్నింపఁగలవె?
పాఁడిపంటలనిచ్చి కాపాడఁగలవె?

ఆ॥ చూచినాఁడ నేఁడు సుఖమునాకు లభించె
చూడకున్నఁ గీడు మూడునేమొ?
మరణమొందియున్న మావారిగతియేమి?
బొందలందుఁ జూడఁ బోదువేమి?

ఆ॥ మానవాళికొక్కట మనసుమారుట గద్దు
కాలమెల్ల సమము గాదె? నీకు
పాలకుండవిట్లు పాలింపఁబడుటేల?
దేవుఁడెవరొ? నాకుఁ దెలియలేదు.

ఆ॥ నిన్నుఁగనకపూర్వ నిమ్నజాతులవారు
కడుపునిండ మెతుకు గుడిచినారు
నిన్నుఁగాంచుమాకు నిండదెన్నఁడు పొట్ట
లోపమెందుఁగలదు ? లోకనాథ ?

ఆ॥ కడుపునిండఁగూడు గలుగువానికిఁ జెల్లుఁ
బూజజేయ; భక్తి పొంగువారు
పస్తులుండువాని భక్తి నిశ్చలమానె ?
ఇరువురందు నెవరి కేమి మేలు ?

మ॥ వెలిలోఁబండితపించుమాలలకు సేవింపంగ నీపాదముల్
గలిగెన్నేఁటికిఁ;గాని వానికయిదుఃఖమ్మొక్కఁడిపూర్వమ్ముమా
కులజుల్ కూలినశించి;రయ్యఘములీక్షోణీస్థలిన్ గాల్చుఁ;ద
త్ఫలమున్ బొందెడివాఁడెవండిపుడు,నీవా? లేకపూజారియా

ఆ॥ పంచములకు నీకు బాంధవ్యమొనగూడె
పాలకులకుఁగూడ జాలిగల్గె
కాని యర్చకుండు కరుణించునో ? లేదో ?
అడిగి మమ్ముఁబిలువ నంపినావె ?

ఆ॥ శాసనమ్ము వలన సమకూడె నీమేలు
కాదు నీవుచేయు ఘనతమాకు
శాసనములశక్తి సమయించె నీశక్తి
బుద్ధియుండలేదు పుణ్యమేమి ?

కం॥ ఏలికలు గోరినప్పుడు
పాలింతువు మమ్ము; వారు వలగాదనినన్
దోలి వధించెదవా? ఇది
పోలునె? స్వాములకు మాకు పొందగునటరా?

ఆ॥ నిన్నుఁ గనులఁజూడ నిన్నియేండులువట్టె
ఎన్నడగ్రహార మెఱుఁగఁగలనొ?
అంటుదయ్యమునకు నది నివాసమ్మంట
పుణ్యమూర్తియింకఁ బోయివత్తు.

# బహిష్కారము

## చతుర్థాశ్వాసము



గీ॥ పురములోఁ జేరి పాడు మామూలు పాట
చిన్న పెద్దలఁ గూర్చి భాషించుచుండు
ఒక్కచో నొక్క ముసలిది దిక్కులేక
బిచ్చమెత్తుట కనుల వివేకి గాంచె.

బలము గతించె; శల్యములు బైటబడెన్; గను చూపు తగ్గెఁ; బ్రొ
తలు మెయి దాల్చెఁ; దొట్రిలుఁ బదమ్ములు; దంతము లెల్ల జారెఁ; కు
క్కల నదలింపఁ గఱ్ఱయును గంచముఁ జేతులఁ బూని మూఁడుకా
ళుల ముసలమ్మ తానొక తలోదరి నన్నము వేడు దీనతన్.

కం॥ అమ్ముదుసలిఁ గనుఁగొని యొక
కొమ్మ గృహాంతరమునుండి గొబ్బునఁ జని వ
ర్ణమ్మది? చెప్పుమన, నో
యమ్మా! నేమాలదాననని పలుకుటయున్.

కం॥ కడుకోపమ్మున నాయమ
కుడిచేతన్ గఱ్ఱబూని కొట్టుచు లేవే?
కుడియెడమలు; మాలలకిల
నడుగిడరా దెన్నఁడగ్రహారము లందున్.

కం॥ భూరితపఃఫలమంతయు
వారిధిలోఁగలియు, మాలవాసనదగులన్
మీరెల్ల నొక్కసారిగ
మారణమగుదాఁక శాంతి మాకిలఁగలదా ?

కం॥ వాకిలి మైలపడిగొ నెం
దాఁకన్ గళయంపిజల్లుదానన్ జెపుమా !
రాకుము మాకొంపలకిఁక
రాకాసీ ! లేచి నడువరాదే ? యనినన్.

కం॥ మగువకు మించినవాఁడా
మగఁడు; గృహమ్మునకుఁజేరి "మానిసి? గళమున్
దెగఁగోయవైతి; వెన్నడు
జగమున నీమాలవాండ్రు చత్తురో" ? యనియెన్.

కం॥ పలువిధముల శోకింపఁగ
నలువురు నటఁగూడినారు; న్యాయము చెప్పం
గలవాఁడు లేఁడు; పంచమ
కులజులకీకులము లగ్నిగుండములుగదా !

కం॥ అదిగని గుండెవివేకికిఁ
జెదరె; దయారసముపొంగెఁ; జెచ్చెరఁజని యు
మ్మదుసలిలేపెను; నిలిచిన
పదిమందినిఁగాంచి యిట్లు పలుకదొడంగెన్.

కం॥ పొట్టకులేక దరిద్రులు
కట్టిడుమలుజెంది తిండికరువున నొరులన్

బెట్టుమన, లేదనందగు
కొట్టుటయా ? అడియునొక్క-కోమలియ? కటా !

గీ॥ ధరణి మాకంటెనీటి కంతమ్ము లేదు
ఎన్నియో సహించెద మిట్టిహీనదశలు
చేతులెత్తుచుఁ గడగండ్లు చెప్పుకొనిన
కరుణవినువాఁడు మూఁడులోకము లేఁడు.

గీ॥ పిలిచె దేవుండు మమ్మును దలుపుదీసి
అడ్డగింతురు నీరు నెయ్యమ్ముమాని
గుడియెటుంగని మరియాద గొంపగాంచె
గుడులనుండువానిదియె తక్కు-వకులమ్ము.

గీ॥ నాలుపోఁగుల టెక్కెమ్ము గాలికెగుర
సత్యమను రథమ్మున స్వారి సలుపువాఁడు
గాంధిసన్న్యాసి నేఁటి యీగాధవినిన
జింతిలఁడె ? వాని కన్నీరు చిమ్ముగాద ?

కం॥ అనుమాటలువిని కనలుచుఁ
గనుగొనలన్ జండ్రనిప్పు కలురాజిల్లన్
వనితవివేకి మొగమ్మును
గనిభీకరనాదమొప్పఁగా నిట్లనియెన్.

మ॥ తెలియంజాలనివాఁడ; వైదుగురుగాంధీజీలు జన్మించినన్
కులధర్మమ్ములునిల్చు; మాలలకుమాకున్ బొత్తులేయంగుసన్
గలుగన్నేరవు; బిచ్చమెత్తుకొని లోకమ్మందు జీవించు వృ
త్తులకుం జావులు లేవు; కష్టమనకుత్తుల్యాయ వేనాఁటికిన్ .

ఆ॥ మాయదారి కాల మర్యాదలుదలంచి
పులిమికొంచురనుచు మురియరాదు
బుద్ధుఁడిట్లు చెప్పి పోలేదె? యానాఁడు
ఎవరికే సుఖమ్ము లేరుపడియె.

గీ॥ అంత్యజులనంటు స్వీయరాజ్యమునకన్న
దానినెడఁబాపు బానిసత్వమ్ము మేలు
గుళ్ళలో మైలపడు స్వామి కొలువుకన్న
గోడపై పంగనామాల కొలువు మేలు.

కం॥ వాదమ్ములేల ? గుడిలో
మాదేవుడు మైలపడియె; మాలడతండున్
భూదేవతల కసాధ్యమె ?
మోదమ్మున వేరు దైవముల సృజియింపన్.

గీ॥ అని గృహమ్మునఁజేరె నయ్యంబుజాక్షి
చింతపడి యిట్లుపలుకు విశ్రాంతిఁగలదె ?
కులపిశాచమ్ము వీరిండ్లఁ గొలువుదీరె
తతసనాతనధర్మ తత్వమును రేపు.

కం॥ ఇప్పగిది నరచుచుండుట
దప్పిగొనెన్ జలమొవండు త్రాగనొసంగున్
తిప్పలుపడుచుఁ నటాకం
బప్పూరిఁ గలదంచువిని రయమ్ముననేగెన్.

గీ॥ గోవులును గేదె లానీరు గ్రోలుచుండు
స్నానమాడంగ నదియె కాసారమయ్యె

మనవి చేకి జలమ్ము నెమ్మదిగఁ ద్రావు
సమయమున స్నానమాడు దుర్జనుఁడొకండు.

కం॥ దేవాలయమంటపమున
నీ వేగద ! నిన్నసామి నిందించితి; వే
భావమునననిందుఁ జేరితో ?
నీవాసనవల్లఁ జెఱువు నీరు చెడెఁగదా !

కం॥ మాటలు పది నేరిచితివి
బూటకములు మాచరిత్రములు నీకవనిన్
ఏటికిఁ గొలఁకునుముట్టితో ?
కాటికి నీతనువు చేరఁ గలదిఁకరమ్మా !

గీ॥ మాలసన్యాసి, యొక్కఁడేమూలకపురు
మానవుఁడు పుట్టునాఁడు ధర్మములు పుట్టె
కాదనినఁబోవునా ? వట్టి కల్లగాని
నోరు కొవ్వెను; కొవ్వు కన్నులకుఁదట్టె.

గీ॥ నీయుపన్యాసములను మన్నించియెవఁడు
క్రిందఁబడు నిన్ను నెత్తికెక్కించుకొనును ?
పిలచినట్టింట బోనమ్ముఁ బెట్టునెవఁడు ?
వ్రిసవముల సెజ్జనెవఁడిచ్చి పండఁబెట్టు.

గీ॥ అనుచు భాషించు నాసమయమ్మునందు
జేరిపదుగురువాని దూషింతురకట
దిక్కుదెలియదు; నదూమబంధింపఁబడియె
ధైర్యమునసిట్లుపలుకనందఱువినంగ.

గీ॥ ప్రాణమర్పింపఁదలఁతు నిస్పట్టణమున
వసుధ నెందరో? తెగిరి నావంటివారు
వారిలో నేనొకండను; భయములేదు
ఏడుకోటుల నొకడూడ నేని వెలితి?

గీ॥ దొంగ, వ్యభిచారి, ద్రోహి, దుస్సంగుఁ, దులుప
లంచగొండిని శిక్షింప మంచిదగును
కలుష మెఱుఁగని దీన సంఘమునకకట
ఎందుకీశిక్ష? అదియు నెన్నేండ్లవరకు?

ఆ॥ మురికిపోవఁగడుగు పురుషుండు దొరయయ్యె
మంచినీరు ద్రావ మైలగల్గె
ముదిరిగడ్డకట్టి మురిసెడి మన తెల్వి
యెఱుఁగరాని దోష మెందుగలదు.

ఆ॥ పసులకుండు గౌరవంబు బొందఁగ లేని
హీనజాతి బ్రతికి యేమిఫలము?
దైన్యహృదయజనిత దావానలము రేఁగి
యెప్డు దేరిఁ జంపు నేరికెఱుక.

గీ॥ దిక్కులేదని మమ్ము నిందింపవలదు
అండలేదని గొంతు కోయఁగఁజనదు
స్వీయ రాజ్యసౌఖ్యమ్ము తెప్పించుటందు
గలదు మావంతు; వ్యర్థజీవులము గాము

సీ॥ మహితవిద్యాప్రౌఢి మర్యాదగని దేశ
మంత్రులైనారు మామాలవారు

వరిముంటివార కన్బడని దీరుపుదీర్చు
న్యాయాధిపతులు మానాటవారు
వరకవికావ్యసుందరుల వంకలుదిద్దు
సత్కవిప్రభులు మాజాతివారు
మేనిరక్తమ్ము నమ్మిన సామికై జిమ్మి
గెలిపించువారు మాకులమువారు

తే॥ గీ॥ ఆడితప్పరు; చేయరన్యాయములను
పస్తులుండియు నీతిదప్పనిజనములు
కష్టజీవులు; పరులసంకటముఁగాంచి
జాలిపడువారు నాదు వంశమ్మువారు.

ఉ॥ నెత్తురుజిమ్మి స్వీయధరణీసతికెగ్గొనరించు శత్రులన్
గత్తులపాలుజేసియు, సుఖమ్ముకు లీనులకప్పగించు నీ
యుత్తమజాతులన్ బిసికియూపిరిదీయు కృతఘ్నులార! మీ
పెత్తనమెన్నినాళ్ళు నిరుపేదలపై నడిపింతు రిమ్మెయిన్.

అలుగుచు మొన్న హిట్లరు భయంకరయుద్ధము చేయుచుండఁబై
కులజుఁడెనండువాని పుకుగున్విదళించెను; తెల్లవారోయి, కొం
పలబడియుండఁ గత్తికొని వార్ధులుదాఁటి పరాక్రమంబునన్
ఖలునిహరించినట్టి మొనగాఁడొకమాలఁడుగాఁడ? యెంచగన్.

చ॥ ముదము వదూఁగియాడనిఁకముందును భారతరాజ్యలక్ష్మికిన్
పదిదిసలందుఁ గాపుదలభారముమాది; విరోధిరక్త నీ
రదనివహావభంజనులు, ప్రాకటసాహసధైర్యమూర్తులున్
గదననవీసభాస్కరులు, గాంచినపంచములేగదా ధరన్.

గీ॥ అనుచుఁ గన్నీరుగార్చ, దేహమువడంక
వెడలె నచ్చోటువీడి వివేకి విసిగి
పాప! మాతని కన్నీరు పండుటెపుడో?
నలువురన్ దలయెత్తు టెన్నాళ్ళ కగునో?

కం॥ అది యెట్టివింతయో! పెను
గుదియలతోఁ బొడిచిచంపఁ గూడినరిపులం
దుదయించె శాంతిచంద్రుఁడు
బెదరింపులుమాని విడిచి వెళ్లిరివానిన్.



# బహిష్కారము

## పంచమాశ్వాసము



ఉ॥ దూరమునన్వివేకి కనుదోయిఁబడెన్ ఘనపుణ్యభారతీ
క్ష్మారమణీమనఃప్రియులసన్మణిచేలపుటంచునాఁగ నొ
ప్పారుచు మూఁడువన్నియలభాసిలుదివ్యపతాక; పుట్టెఁబో
తీరని ఖేదమాత్మ; నిజదీనగతిన్ దలపోసి యిట్లనున్.

శా॥ తల్లీ నేఁటికినిన్నుగాంచితిని స్వాతంత్ర్యమ్ము చేకూరుటన్
పిల్లాజెల్లలు గీతవాద్యములతోఁ బ్రీతిన్భజింపంగన
త్యుల్లాసంబున మింటనాడెదవు శ్రీలొప్పార; నేదీనులే
కల్లోలాగ్నిఁదపింతురో? ఎవరికేకష్టాలో? యోచించితే?

గీ॥ సకలజీవులు నీనీడ శాంతిఁగనుచు
హాయిగా భారతక్షోణి నలరుచుండ
నాకునానారి కెండ్రవానలుగదమ్మ
కారణమ్మేమి? నరులముగామ? చెపుమ.

గీ॥ గుణములేకున్న నేయగ్రకులజుఁడైన
నధముఁడయ్యెది గలవాఁడె యధికుఁడండ్రు
ఎన్నడీధర్మమిల నన్వయించు మాకు
అంబ! మాగుణంబులకు మర్యాదలెపుడు.

గీ॥ పాలరొమ్ము లగ్రజపాళి పట్టి కుడువ
వట్టితిత్తులైనను మేము ముట్టఁదగదు
పక్షపాతమ్ము భారతాంబ దగదమ్మ!
న్యాయమిదియౌనె? జనని! సత్యము వచింపు.

చం॥ సమదవిరోధులన్ గెలువఁజాలునశోకమహీంద్రధర్మచ
క్రమును ధరించితౌర? యుదరంబున; నాతనివారలేని ధ
ర్మము, సహనమ్ము, శాంతము, సమత్వము నీకడనున్న వేమొ చె
ప్పుము; అవియున్న నేను వలపోయఁగనేల? సతమ్ము దల్లిరో.

ఉ॥ ఇమ్ముగ నింటియందు విహరింతువు; బారులుగట్టి దేవతల్
దిమ్మకుచుందురంట రవిదీప్తుల; నందుము రారిఁగాంచినన్
“నమ్మ”ని సంఘధర్మసముగస్థితిఁ దెల్పుచుఁ జెప్పుమన్నరో,
మమ్ములనుద్ధరింపనొకమాఱనతౌరముఁ బూనుమందొగిన్.

గీ॥ సవనిసత్తుల రాపాడఁబడఁగ జనని!
రాజులాంగ్లులైనపుడు కారణముగలదు
ఇడుమలా! మాకు మనయేలుబడులయందు
నాకు స్వాతంత్ర్యమింక నెన్నడు లభించు.

ఆ॥ కడుపునింటవలనఁ గసరితి నిన్నిట్లు
భక్తిలేకగాదు; పశుఁడఁగాను
ఉరురథమ్ముమీఁద నూరేఁగు సమయానఁ
గత్తిఁ బట్టి నిన్ను గాచువాఁడ.

ఉ॥ విచ్చినమంచిమల్లియలు వేసలికై సమకూర్తు భక్తినై;
నిచ్చలు సర్వవైరి ధరణీపతు లాత్మల సిగ్గునొంద, నీ

సచ్చరితంబుఁ జూడెద; లసన్మణికాంతులపల్లకీలలో
నచ్చపుఁ గీర్తిమైదిరుగునప్పుడు ముందునటింతునేఁగదా?

మ॥ జననీ! యింకొకమాట విన్నవుగనాసల్లర్, నేమందువో?
అనుమానింపక నానిషాదచరితం బాయాప్రజానీకముల్
విన నోరెత్తినచింపుగా భగతస్ఫూర్తి భాగమందెల్ల; నే
ఘనుఁడైనన్నమునుద్ధరింపఁగలమార్గమ్మెంచు నేమో? వడిన్

ఉ॥ భారతలక్ష్మిమాకెపుడుబంధమువిప్పునో? నాయకోత్తముల్
కూరిమిఁబూని మంచియనుకూలపరిస్థితిఁగూర్చు చెన్నడో?
నేరమువాయు టెట్టులో? అనేకవిధమ్ములఁ నచ్చఁబల్కయే
తీరునసైన సత్సుఖముఁ దేఁగలవేమొ? తలంపుమంబరో?

చం॥ వరుసగ నావిపద్దశలు వారికి వీరికిఁ జెప్పువేళ, నే
పగలు వినంగరాదు; తెలవానిచెవిన్ బడరాదు; చిన్నపు
త్రుగు మనవారు బేలలని; దుండగమౌ; నదిగాక హైందవో
త్క-గముల నేలునీకు నసుఖంబపకీర్తి ఘటిల్లుఁగల్లిరో!

చం॥ కులమునఁ బేదనై, తినుటకు న్నొతుకింతయు లేనివాఁడనై
పలికిన సత్యమైన నడఁబట్టివధింతురు; నోరులేనిదీ
నాలుతి నీవెరుంగవె? అనూనదయాగుణరాశివీవు; నీ
వలిగినఁజెల్లు; నెవ్వఁడైన రాడఁడు; అడిగినఁ బ్రాణముండునే?

కం॥ నిరుపేదలఁబరిమార్చన్
బరుగిడుశాసనము భాగ్యవంతునిఁ గనినన్
గురుతరభయమున వెనుకకుఁ
దిరుగును, కారణములేమొ? తెలియనడుగుమా?

శా॥ కల్లోలాగ్నిఁ దపింపఁగా రకులు లోకంబందు మోదింప, నా
తల్లీదండ్రులె? తాతముత్తవుల? మాతా! నీవె? ఎవ్వారలో?
ఉల్లాసంబున సల్పువారందిరుగ లేవో? వ్రాఁత లేనాటికిన్
ఢిల్లీకేగి మహాత్ములౌ సచివకోటిన్ గూడి ప్రశ్నింపుమా.

ఉ॥ తాపముఁ జెందు సజ్జనవితానవిచారము డంపఁ గోరెయో?
ఏపనిఁ బూనియో? కడుశ్రమించుచు మంత్రులు పర్యటింతురం
దోపికతోడ నీవుఁ జనుచుందువు; విందువె? వారిపల్కులన్
జీవు శిరంబుసన్నటన జేయుదువే? గమనింతు నంబరో!

కం॥ నాకతలాసమయమునం
ధాకర్ణించెదవె? మంత్రులనుకొనుచుండన్
వాకొందువె? నాతరపున
నీకనుకూలముగఁ బనులు నెఱపుదురుగదా!

కం॥ లోపము తెలుఁగను; జెందెద
రాపిడి; సంఘంబు సమరరంగంబయ్యెన్
నాపక్షమూనుమనియా
జీవునకున్ జెప్పు, మేలు సేకురు నేమో?

ఉ॥ ఉండఁగఁ గొంపలా? తినఁగనోగిరమా? ధరియింపఁ బట్టలా?
పండఁగఁ బాన్పులా? పిలువ బంధువులా? విహరింప సంఘమా!
ఉండిననూడినన్ గొఱఁతలుండునె? దిక్కుసుమంత లేక నీ
యండకుఁ జేరితిన్, తగుసహాయమొనర్పఁగదమ్మ! నమ్మితిన్.

ఉ॥ సందడిలేని వేళ, సరసత్వనిమగ్నతఁ జెందు వేళ, నా
వందనమప్పగించి తరువాత మదీయవిషాదగాథఁ జె

ప్పందగుఁ బూసగూరిచినభంగి; దయారసపూర్ణులౌదురో?
నిందలొనర్తురో? తెలుపు, నీకగుదీర్ఘసుఖాయురున్నతుల్.

కం॥ అనియిట్లు రాలుగఁబలుగన్
దనవేదనఁ జెప్పుకొనఁగ యెఁ దడుసరిపోవన్
వెనుకకుఁ దిరిగిన నందొక
మనుజుఁడు తలపోయుచుండె మదినెయ్యదియో.

ఉ॥ ధీరుఁడ! నీవు తీవ్రతరదృష్టులు గాజిలనేమిగాంతు; వే
యూరు నివాసభూమి? యెవరోయి! బహిష్కరణాగ్నిఁగూలున
న్నారడిజేతువేమి? అసహాయుఁడ; మూలఁడ; ఖేదమొందిస
త్కారమొనర్పుమా! యని పతాకనుగోరెద, నేరమానొకో?

సీ॥ భారతాంబామణీ భర్మడోలికలపైఁ
గళలనొప్పారు బంగారుగొడుగు
హైందవరత్న సౌధాంతరాళమున స
చ్ఛాంతిచంద్రికగాయు చందమామ
భారతసద్వీరపాళికి పౌరుష
వారిధారలొసంగువారిధరము
హిందూమహీరామ కెంచి భాగ్యోన్నతుల్
కురిపించు ముద్వాన్నె సిరివెలంది

తే॥ గీ॥ యనఁగనొప్పు పతాకనేనాశ్రయింతు
నేమమిడఁజాలునంచు నర్పించుచుంటి
అందుకైనను హక్కు లేదందువేమొ?
పలుకవా? యనఁగ వివేకి పలుకునతఁడు.

కం॥ నిను నిందించుటకును గా
దనుటకు నేనెవఁడఁ; గుఱ్ఱఁడా? కడుశోకం
బును గూర్చు నీయుదంతము
వివనిలిచితి; దీనజనులఁ బ్రేమించెదరా!

కం॥ మానముచెడి యేనాఁడును
బోనమ్మును లేక నలిగి పోయెడునిన్నా?
పోనాడుట, పుత్రుండా!
యేనొక కవీశుఁడన్ రచించెదఁ గృతులన్.

ఉ॥ తీరనిఖేదవార్ధిఁబడి, తేలువిధానములేని నీదు వి
స్తారవిషాదగాథ పరితాపముఁ గూర్చె; దయాప్రపూర్ణయా
భారతలక్ష్మికెగ్గుడెవండొనరించెనో? మానులార; నే
దారుణశాపమిచ్చెనో? గదా! సుఖమెన్నిదినాలకౌనొకో.

ఉ॥ ఎన్నికఁగంటివీవు విరచించెదనీకత; విభ్రమంబునన్
నన్నిడె; బాలకా! పసితనంబునవాక్చతురత్వ మిట్టిదే
తెన్నుఁనఁగ గ్గె; నిన్ననినధీరుఁడెవండు? విశుద్ధబుద్ధిమే
యన్నులమిన్నయిచ్చి కనులంమునఁబెంచుననారతమ్ములన్.

కం॥ నినుఁబోలు ధీరచిత్తుఁడు
ఘనతరకావ్యమ్ములల్లఁగలకవియగు, నీ
కనువగు శిక్షణయొసఁగెద
అనుమానము మాని వత్తువా? యనియడుగన్.

ఉ॥ బాలుఁడు వందనంబిడి యభాగ్యుఁడ, నాపయినింతజాలి నీ
కేలఘటిల్లె; నల్వుఁగదలించుచునిన్వాలి వేయకుందురా?

చాలు ఘనత్కృపారసము, శాంతియొకింతలభించె; నిట్టిచెం
డాలురఁజేరఁదీయమరణవ్యథనీకగుఁబొమ్మ! సత్కవీ!

చం॥ చెలువుగనన్ను నాంధ్రకవిఁజేసెదనందువు; మచ్చరిత్రగా
థలు విరచింతునందు; విదితప్పుసుమా! కవులన్న నాకు వై
రులు; శపియింతుఁదిట్టెదను; రోయుదునిచ్చలుకారణాలు పె
క్కులుగలవయ్య! యెంచివినఁగోరెదవే? వచియింతునో కవీ!

కం॥ కవికులమును నిరసింతువ?
కవులప్రతిమానకావ్యకారకులుగదా?
కవులేమొగ్గొనరించిరి?
వివరింపఁగదే, యనన్వివేకికవికనున్.

కం॥ సమధర్మము, శాంతము, స
త్యము, నిర్మలశీలమునున్మదంబును, సద్భా
వములాదిగుణము లన్నియు
సమగన్ గవియొప్పునన్న నదియెఱుఁగనొకో?

కం॥ ఏదేశమ్మునఁ గవి మ
ర్యాదలు పరిఢిల్లుఁ; గావ్యరమణీమణులా
మోదమున నటన సల్పుదు
రాదేశము స్వర్గతుల్యమనియు నెఱుఁగుదున్

కం॥ కవిశాశ్వతుఁడు నిరంకుశుఁ
డవిరళకీర్త్యంగనావిహారుఁడు సుజనో
పకారుఁడమలఘనకా
వ్యవితానవిధాతయంచు నాత్మదలంతున్.

కం॥ పాతాళంబును, భాస్కర
శీతమయూఖగ్రహాల చిత్రగతుల, వి
ఖ్యాత స్వర్గము, సురలన్
క్ష్మాతలమునుండి చూడఁగలఁడని తెలియున్.

కం॥ గగనము సాగరగర్భము
ఖగజాతిగళమ్ము మృగనికరగహ్వరముల్
భగవత్సన్నిధి నగగుహ
లకుఁగవిసంచారవీథులనిగుర్తింతున్.

కం॥ పూతజగన్నిర్మాతయు
భూతలవాసులను నెల్లఁ బూజ్యుఁడు, నసమ
ఖ్యాతుఁడు శాపానుగ్రహ
చాతుర్యముఁగలుగువాడు సత్కవియన్నన్.

కం॥ అగణితచతురోక్తులఁ జ
క్కఁగఁ గల్పనలందుఁగూర్చి, కవితాసుధఁబ్రా
ణిగఁజేసి రాతిముక్కను
జగములనుబ్బూతలూపఁ జాలుదురుకవుల్.

కం॥ ఇట్టి కవీశులు దీనుల
పట్టుయిమసదారసరణి బ్రతుకుచు ననసన్
దిట్టలనిపించుకొందురు
కట్టా! దుర్ణయులుఁగలరు కవికులమందున్.

కం॥ దొంగను లోభినిఁగడుదు
స్సంగుని, స్వార్థమ్ముఁబూని సజ్జనుఁడని వ్రా

యం గలుషమతానుగద ! ఇ
బ్భంగి ప్రవర్తనము కవికి సరువే, చెపుమా?

కం॥ ధనమున్న మదము పొంగును
కనులాఁ? కనఁబడవు, దీనగణములకురియై
మనునతఁడు వాని సదయుం
డని పలుకుట కవికి ధర్మమందువె? సుకవీ?

కం॥ ఊరునుగాడునురోసిన
క్రూరుని దుశ్చరితుఁ బరమకుటిలునిఁగడున
ధీగుఁడని పూవుటత్తఱ
సిరసులో ముంచనెట్టి సితికవీశా !

కం॥ అడుగడుగుఁ గల్లలాడుచుఁ
గూడితొడములధనముదోఁచుకొనుదుర్జనులన్
గడుఁబుణ్యపురుషులన సరి
పడునా? పెద్దలకుఁ గఠినపాపముగాదా?

కం॥ కగాగాశాంతము తెలుఁగని
దురితులు బనధనముమ్రింగు దోపిడిగాండ్రన్
బరుపాక్రిణులని పొగడినఁ
బగునే? ఏమందివివినఁ బకసకనగ నే ?

మ॥ ఒకరిస్వర్గగిరి సంపదల్గలుగునంచుత్సాహముప్పొంగలో
భి సద్యఃపసవవ్రిజాగ్భనలుగావించున్; సురేశుండు వా
నికిఁజాలండని రచ్చలస్సభల వర్ణించున్; ఖలుండయ్యునూ
రకనూపున్దలవాఁడునోసుకవిధీరా! న్యాయమా? యీపనుల్

మ॥ పరమానందముఁగూర్చు నీకయిత, శుంభద్దివ్యకావ్యాంగనా
కరమున్నాకిషుమా! పసిండిమణులన్ గట్నంబులర్పింతునం
చురుకాంక్షన్ బురికొల్పి, తత్కవినిరాశోగ్రాగ్నిలంబందు నెం
దరు పుష్టుల్ వడిఁద్రోయు, రట్టెగతిగాదా? మీదికవ్యాగ్రిణీ!

మ॥ రవిసూనుండు శిబీంద్రుఁడాదిజనులౌరా! దానమందెన్నఁద
క్షు వసీకన్న, సుఖాయురున్నతులు నీకున్ గల్గుఁబో? మున్న యా
కవియే వానిశపించి యశ్రువులు పొంగన్ నిప్పులంజిమ్మ; కం
టివిగాదే? ప్రారబ్ధాటులెవ్వగిపి? ఫోనీ! నీన వాక్రువ్వుమా

చం॥ పదికినవర్హునింగొలిచి పాపముఁజెందుటకన్న వంగి నె
మ్మదిగ సలాముజేసి నిజమార్గముఁ బట్టిన నీశ్వరుండు సం
పదలిడు; నల్వురున్ గవినిఁ బాడుదు; రద్దిసుఖమ్మెగూర్చున
య్యది చిరకీర్తికిన్ దెఱవునై విలసిల్లు వసుంధరాస్థలిన్.

భూరిధనాఢ్యుఁడున్, స్వసుఖమున్మదిఁగోరెడులోభి, దొంగవ్యా
పారియుఁ, గల్లరీఁడు కవిభవ్యతగోజ్వల కావ్యకన్యకన్
గోరఁగరందు; కోరినను గూడదు సేమము; విత్తమేల? వి
స్తార రసజ్ఞుఁడై వరలుత్యాగిసమర్థుఁడు తల్లతాంగికిన్.

కం॥ అచ్చువడ వాఙ్మయావని
నిచ్చలుగుణవంతులౌ వనితలున్ బురుషుల్
ముచ్చటగనుందురచ్చట
లుచ్చాలకుఁ దావులిడ ఖలుండగుఁగవియున్.

కం॥ కలవియొ? లేనివో? కొన్నిటిఁ
బలవించితిఁ, దప్పులున్నఁ బాటింపక ని

శ్చల సౌఖ్యాశీస్సులతో
సెలపీగదె, పోయివత్తుఁ జెలువుగసుకవీ !

ఉ॥ చెలువగు పల్కులన్ సుకవిశేఖరుఁడల్లననాలకించి, ని
ర్మలగుణశాలి బాలుననురాగమునన్ గవుగింటగ్రుచ్చె; న
వ్వులనెలమోమునన్వెలుఁగ, బుద్ధివికాసమునాత్మ మెచ్చుచున్
దలపయిహస్తమ్మున్నిమిరి, తాననునిప్పగిది న్వివేకితోన్.

చం॥ సకలమునీవెఱుంగుదువు; సంతసమందితిఁ; బుట్టికొన్ని. పు
ట్టకమరికొన్ని నేర్చితి; వడంకువమున్నుగలట్టి సద్గుణ
ప్రకరమునీకు సదనము; పైసలదేమిఘనంబు? ఆంధ్రవా
ణికి దయబుట్టె నీపయిననే యుగంబులనుండువామెతోన్.

మ॥ కవినిన్ గూరిచి నిర్వచించినది నిక్కంబౌ; సమగ్రంబుగాఁ
గవితాశక్తి గ్రహించినా; నయినవక్కాణింతునీకొక్కమా
నవకర్తవ్యము; మంచినెంచఁదగు డెందంబందునెవ్వానికిన్
అవనిన్ లోపములేనిపూర్ణుఁడుగలండా? యెంతగాజూచినన్.

ం॥ తనమనసార నీశ్వరపదద్వయ నీరజసారమాని, దా
నినిఁ బదిమందిగోర్కులు సరణిన్వివరించి ముదంబు జెందువా
నినిఁ బరమోపకారినిగణింతువె? స్వార్థపరుండటంచు; నా
తని దయసల్లఁగాక మఱిదైవము నెవ్వఁడెఱింగె ధాత్రిపై.

ం॥ ఒకఁడు సుఖింపసంతసిలు, నొక్కని వేదనఁ బాలుబొందు; నే
రికి నపకారమెన్నఁడొనరింపని నిర్మలధర్మమూర్తి, మా
నక నిజరక్తమాంసము లనాథులఁగావవ్యయించునట్టివా
నికి నపకీర్తులా? సుఖము నెగ్గున? సత్కవి లేని భూమికిన్.

కం॥ హీనుఁడని నీవుదలఁచిన
మానవునకు నొక్కగుణము మంచిదియుండున్
దానిఁగవిగాంచివ్రాసెనో?
దీనన్ గల తప్పులేవి? తెలుపుకుమారా!

మ॥ కృతికన్యామణియొక్కదుష్టునికిఁ జిక్కెన్ బొమ్మ, సత్కీర్తివి
శ్రుతమానాఁడయినన్ బ్రతిన రత్నముమారునే; మారదా? వానికా
కృతిపుణ్యమ్ము ఫలింప; దయ్యదియొభక్షించున్ బతిన్ బంధులన్
మతిహీనుల్దలపోతురక్కవికి ధర్మమ్మింత లేదంచెదన్.

మ॥ కవికన్యాయమొనర్చుపాపికడుదుఃఖమ్మొందు; చెండాలియై
వివిధస్థానములందు, నాగరికులన్ విద్వత్సభన్, గచ్చలం
దవమానాగ్నిఁదపించుఁదుర్యశములానాచంద్రతారంబుగన్
కవికన్నీటిఫలంబువాయిది, ధరన్ గార్చిచ్చురా! పుత్రికా.

కం॥ అని యింకెద్దియొ? చెప్పెను
చినవానికి వచ్చెఁ గవినచించినదెల్లన్.
మనమునసంతోషించుచుఁ
జనిరిరువురు నవ్వుకొనుచు స్వస్థలములకున్.



ఓంకార్ ప్రెస్, గుంటూరు.